సమకాలీ నములు

## వెంకటగిరి జమీందారు రయితులు.

వెంకటగిరి జమీందారు వరకును, రయితులకును జరుగుచున్న వివాదము, కొలదిరోజులలోనే తీవ్రరూపమును దాల్చునట్లు గనపట్టుచున్నది. ఈ దేశమున, రయితు ప్రజలస్థితి, బహుశః మోయు పశువుల స్థితికంటె హీనముగనున్న విషయమెల్ల తెలిసినదే. అందును జమీందారీ రైతుయొక్క కడగండ్లు వర్ణింప నలవిగాదు. జమీందారుల కాతడు, చిర బత్తెములు లేకుండ నూడిగ మొనర్ప వలసిన బానిస. వారిపై జమీందారు లొనర్చు దౌర్జన్యములకును నిర్బంధములకును అంతులేదు. ఈ జమీందారీ పద్ధతివలన గల్గిన ఫలిత మొకవైపున కుంగి కృశించి శల్యావశిష్టుడైయున్న జమీందారీ రయితు, మరియొకవైపున, రయితు నుండి కొల్లగొట్టిన ధనసంపదలతో నేమి చేయుటకు దోచక, విషయలంపటులై స్వేచ్ఛావిహారులై కేళివినోదాదులందు కాలముబుచ్చు జమీందారీ ప్రభువులు. అందుచే, చాలామంది అధికారులును ప్రామాణికులును, ఈ పద్ధతిని సాగించుట దేశారిష్టకరమని భావించి, జమీందారీలను రద్దుచేయవలెనని గోరుచున్నారు. వెంకటగిరి జమీందారీ రయితులు గోరిన దిట్టి దేమియునుగాదు. జమీందారీ బీడు భూములలో పశువుల మేపుకొనుటకు వసూలు చేయుచున్న పుల్లరిరేటు గత 40 వత్సరములలో 20 రెట్లు హెచ్చింపబడెను. ఈ జమీందారు, తన రయితులనుండి పన్నుల నెటుల వసూలు చేయుచున్నదియు దెలుపుట కిదియొక్కటియె చాలును. అంతియగాదు. ఈ పన్నుల నిదివరకు జనవరి ఫిబ్రవరి మాసములలో వసూలు చేయుచుండిరి. ఈవత్సరము వెంటనే చెల్లింపవలసినదని జమీందారీ అధికారులు గోరుచున్నారు. ఆర్థిక విపత్స్థితిచే కడగండ్ల గుడుచుచున్న రయితులకు జమీందారుగారాలోచించిన సదుపాయ మిదియేగాబోలు! పుల్లరి రేటును సగమువరకు తగ్గింపవలసినదనియు! మామూలు మాసములలోనే వసూలు చేయవలసిన దనియు మాత్రమే రయితులు గోరిరి. వెంటనే తగ్గించు

## బకింగుహాం కెనాలు యొక్క దుస్థితి:

వెంకటగిరివారి ఉపేక్ష,

ప్రభుత్వమువారు ఎట్టిచర్యగైకొనకుండుట,

స్వర్ణముఖ శాఖా నదియగు చల్లకాల్వయనునది శ్రీరాజాగారికి సంబంధి

---

విషయమును జెప్పజాలనిమొకల, కుమారరాజాగారు పాశ్చాత్య దేశములలో చేయుచున్న పర్యటనమును ముగించి వచ్చిన పిదప, నావిషయము నాలోచింతెమని వాగ్దాన మొనర్చిన జాలు వనిరి.

అట్టి వాగ్దాన మొనర్చుట మంచిదని ప్రధాని సలహా యొసగినను మహారాజుకు మాత్రము నచ్చదయ్యెను. రయితులొక్కొక్కరుగ తమకు వినతి పత్రము లర్పించుటయేగాక, అందరును గలసి తమతో రాయబారముల జరుపుటకు సాహసింతురాయని, దర్బారు భంగముగ భావించిరి. మహారాజగారు వృద్ధులగుటచే తమ చిన్ననాటి రోజులే ఇప్పటికి నున్నవని భావించుచున్నటు లున్నది. రయితులుగూడ, తామును మనుష్యులమేననియు, సంఘజీవన మొక్కరి సొత్తుగాదనియు దెలిసికొనుచున్న విషయము, వారికి దెలియక పోవచ్చును, నేటి కాల పరిస్థితుల బాగుగ దెలిసికొన గలిగిన కుమారరాజాగారు, మహారాజ కుమారులును, పరిస్థితులు విమర్శించి రయితులు సత్యాగ్రహమునకు దిగకముందు, ప్రజాప్రాతినిధ్యహక్కు నంగీకరించి, రయితు ప్రతినిధుల న్యాయమగు కోర్కెలను మన్నించి, ప్రజలలో వ్యాపించుచున్న "జమీందారులు ప్రజాకంటకుల" ను భావమును తొలగించుటకు ప్రయత్నించెదరని నమ్ముచున్నాము.

జన్మభూమి.

---

చిన (పల్లాం తాలూకా) కర్లపూడి. సిద్ధవరం గ్రామముల సమీపమున ప్రవహించి బంగాళాఖాతమున కలియుచున్నది. సదరు చల్లకాలువ పొర్లుకట్టకు షుమారు ఇరువది సంవత్సరముల క్రిందట నాలుగు కొద్దిపాటి గండ్లుపడి ఆ ప్రవాహమువల్ల బకింగుహాము కెనాలు కట్ట తెగి కాలువ పూడినందుకు ప్రభుత్వమువారు షుమారు (15000-0-0) పదిహేనువేలు రూపాయలు ఖర్చుపెట్టి కట్టను, కాలువ మరమ్మతులు జరిగించినారు. అప్పట్లో జమీందారుగారు వారియిలాకా పైరెండు గ్రామముల సమీపమున యుండు చల్లకాల్వ పొర్లుకట్ట గండ్లు మరమ్మతులు చేయక ఉపేక్ష చేసినందున యీవల కురిసిన వర్ష ప్రవాహములకు పొర్లు కట్టలు పూర్తిగా తెగిపోయి ప్రవాహజలము యావత్తు ప్రతి సంవత్సరము కర్లపూడి, సిద్ధవరం గ్రామ పొలములు, చెరువుకట్టలు, పైరులు నశింపుచేసి కర్లపూడి గృహముల కూల్చి, పశువుల నాశన మొనర్చి, సిద్ధవర సమీపములో యుండు బకింగుహాము పొర్లుకట్ట తెగి కాల్వపూడి పోవుచూ పెద్దపెద్ద గండ్లుపడి మనుష్యులకును పడవలరాకపోకలకు యిబ్బందులు కలుగుచున్నది. ఇందుకుగాను ప్రతి సంవత్సరము ప్రభుత్వమువారు (10000-0-0) షుమారు పదివేల రూప్యములు వరకు వ్యయ మొనర్చి మరమ్మతులు చేయుచున్నారు. శ్రీ జమీందారుగారు పొర్లుకట్టలు వేయించనందున యీ నష్టము కలుగుచున్నదను సంగతి బకింగుహాం కెనాలు అధికారులకు దెలిసియుండిన్నీ మూకీభావము వహించి ప్రభుత్వము వారికి తెలియ బరుపకయున్నా జమీందారుగారిపైన యెట్టి చర్య గైకొనకుండుట కడు శోచనీయము. ఇంతటనైనా ప్రభుత్వమువారు శ్రద్ధవహించి శ్రీరాజాగారితో సంప్రదించి ప్రజలకు కష్టము లేకుండా పడవలు రాకపోకలకు యిబ్బందులు లేక యుండునటుల చేయుదురని బకింగుహాము అధికారులనున్నూ ప్రభుత్వము వారినిన్నీ కోరడమైనది.

---

# వెంకటగిరి యెస్టేటు ప్రామిసరి నోట్లగోల.



నెల్లూరు వెంకట్రామానాయుడు.

---

పూర్వము శ్రీ మహారాజాగారి హయాములో రైతులు చెల్లించవలసిన భూమిశిస్తు సకాలమునకు చెల్లించుకో లేని స్థితిలో నున్నప్పుడు రైతుపై వృథాగా కోర్టులో దావాలబెట్టి నష్టపెట్టక శిస్తు బాకీకి ప్రామిసరినోటు వ్రాయించుకొను ఆచారముండినది.

నేడు యీ యాచారము అనుగంటనను మరొక విధమున ఈ ప్రామిసరి నోట్ల బాధ రైతులపాలిటికి ఉరిత్రాడై చుట్టుకొని రైతును వేధించుచున్నది.

సన్ 1336 ఫసలీలో వర్ష ప్రతికూలమువల్ల పైర్లు యెండిపోయి రైతులకు నష్టము యేర్పడినది. మామూలుగా పైర్లు యెండిపోయినప్పుడు రైతులు జమీందారుకు అర్జీలిచ్చుకొనుటయు, ఉద్యోగులు వెంటనేవచ్చి తనిఖీచేసి రైతు వద్ద యథాశక్తిగుంజి యెండినభూములకు అవిధేయులకు తప్ప తక్కినవారికి కొంత అటో యిటో రిమిషను యిప్పించుటయు కద్దు. అట్లే యీ 1336 ఫసలీకి పైర్లు యెండిపోయిన వెంటనే రైతు లర్జీల నిచ్చుకొనిరి. ఉద్యోగులు తమకు తీరునప్పుడు వచ్చి భూములు తనిఖీచేసి రిమీషన్ నిప్పించుటకు రైతులవద్ద యథాశక్తి గుంజిరి. ఈ గుంజాట యీ వెంకటగిరి తాలూకాలో కొన్నిచోట్ల రు 1-కి 0-12-0 లు వంతున [illegible] పూర్తిగిన్ను కట్టలేక, ఈమామూళ్లు యిప్పించనిచో రిమీషను కష్టము తగులుదురను భయముచేత రైతులు చచ్చినట్లు ముడుపులు చెల్లించుకొనిరి. తర్వాత మూడు సంవత్సరములకు రిమీషను లెఖలమీద ఇంతవరకు వుత్తరువులు రాలేదనియు కాబట్టి రిమీషనుకోరు మొత్తములకు ప్రోనోట్లు వ్రాసి యిచ్చినయుండగా, రిమీషను లెఖలమీద వుత్తరువు అయిన వెంటనే ప్రోనోట్లు వాపసు యివ్వబడుననియు రైతులకు నచ్చచెప్పి రైతుల వల్ల వెంకటగిరి తాలూకాలో ప్రోనోట్లు వ్రాయించి తీసుకొనిరి.

అప్పటికున్న ఉద్యోగి మారిపోయెను. మరియొక ఉద్యోగి యీ తాలూకాకు రాబడెను. మొదట గుంజినవారు రిమీషను యిప్పించుటకు రెండవ దఫా ముడుపు చెల్లినగాని ప్రోనోట్లు రైతుల చేతికి రావని ప్రచారము సాగించిరి. మొదటనే రైతులు భరింపరాని మొత్తముల ధారబోసిరి. గాని చేయునది లేక రెండవదఫాగూడా దేముడాయని యీ కింకరులకు గ్రామముల దామాషాహి ప్రకారం చెల్లించుకొనిరి.

కాని యింతవరకు ప్రోనోట్ల దర్శనముగాని, ముజరా యిచ్చినట్టు నిశ్చయంగాని తేలలేదు. కొన్ని గ్రామాలలో విచారించిన వారు కోరిన ముజరాకంటె తాము పెట్టిన దండుగలే హెచ్చుగా కనులబడుచున్నవి. మచ్చుకొకటి చూపెట్టెద.

ఒక గ్రామములో తాము కోరిన రిమీషన్ రు 500 లు ఇందుకు అరయితులు ప్రథమదఫా యిచ్చినది రు 1-కి 0-8-0 లు వంతున అయిన మొత్తం రు 250 లు ఉద్యోగులు మారినందున వ్రాసి యిచ్చిన ప్రోనోట్లువాపసు తెచ్చుకొనుటకు సమర్పించినది రు 1కి 0-4-0 లు వంతున అయిన మొత్తం రు 125 లు కుల్లు రు 375 లు ఈ మొత్తములో చేరిన కొందరు రయితులు ప్రోనోట్లు వ్రాసి యివ్వబడినను లిమిటేషన్ వెళ్లిపోతున్నవను కారణముచే దావాలు చేయబడినవి, గ్రామాల్లో [illegible] కొందరు శిస్తు చెల్లించినను [illegible] మొత్తములు దావాలో చెల్లు వేయించకనే డిక్రీలు చేయిం[...] నారు. ఈగ్రామస్తులకు జరిగిన [...] యం యెంత విపరీతముగాన[...] యుగలదు. పరిపాలకులు లం[...] లైసన్సులు యిచ్చినను బాగు[...] యింతకు యీగ్రామస్థులకు యి[...]

రిమీషను లేదు. ప్రోనోట్లు వాపసు యివ్వనులేదు. దావాల డిక్రీల కథ యింతవరకు పరిష్కారము కానూలేదు. యీ లాటికథలు గ్రామములలో ప్రవేశించిన అనంతము గాగలవు.

ఇప్పటికి 6 సం॥లు అయినను 1336 ఫసలి రిమీషనును గురించి రయితులకు తెలుపకపోవుట చాలా విచారకరము. ఇంతటనైనను ఆఫసలి లెఖల పరిష్కరించి రయితులవల్ల వ్రాయించుకొన్న ప్రోనోట్లు వారికి యిచ్చివేయుట శ్రేయస్కరము. వెనుక వ్రాసియిచ్చిన ప్రోనోట్లకై యింతంత మొత్తములు ధారబోసుకొని, ప్రతిదినము నగరిద్వారముల కడ రయితులు కాచుకొని దర్శనములే లేక సంవత్సరము లాదిగడచి పోవుచున్నవి. సంస్థానపు ఉద్యోగులు యీ లాగు లూటీలు కొట్టుచుండిగా యీ ప్రవాహమును ఆపుకొనుటకైన రయితులు ప్రయత్నములు చేయక చేతులు ముడుచుకొని యుండలేదని పాలకులు విషయము గ్రహించుటయే మాత్రము న్యాయముగాదు. విచారించు మహనీయులున్న ఈ లంచముల కథలతో రయితులు యెట్లు దరిద్రులై పోయినది తెలిసినసాక్ష్యము కద్దు. సంస్థానమువారు యింతట నైనా న్యాయవిచారణ సంఘమున కొప్పుకొని రయితుల ప్రాతినిధ్యముతో ఒకవిచారణ సంఘము నేర్పరచి వరయితుల కుండు కష్టములు తెలియగలవు. సంస్థానమువారు యిప్పుడున్న ఉద్యో[...] నైన వదలుకొనవలె, [...] రాజ్యభ్యలైన రయి[...] న్నా, ఈ రెంటిలో[...] చుకొను[...] బయట[...]

# నమ్ము, నమ్మకపో.

మొదటి క్రైస్తవ చక్రవర్తి అని పేరుబొందిన కాన్స్టాంటైన్ అనురోమను సార్వభౌముడు క్రీస్తుమతమును శాస్త్రీయము చేసియుండలేదు క్రైస్తవుడు గాక నే వ్యనుతావలంభియై యుండెను.

◆ ◆ ◆

గత యుద్ధంలో ఒక బ్రిటీషు విమానము తవనదుపు వారిద్దరు శత్రువులకు బలికాగా, ఆ ఇద్దరి శవములతో ఎగిరి ఎగిరి కొన్నిగంటల తదనంతరము సురక్షితముగా భూమిమీద వ్రాలినది.

◆ ◆ ◆

విలియం కెల్లరు అను న్యూయార్కు పట్టణస్థుడు ఒక వత్తనుపట్టుకొనిపోయి ఇంట తగులదీయగా అందు ఒకచేప బ్రతికియుండినది.

◆ ◆ ◆

న్యూయార్కు నగరమున మిస్ మార్గరెట్ హిల్లర్ అనునామె మధ్య ఆగకుండా 89 గంటలు నృత్యము (డ్యాన్సు) చేసినది.

◆ ◆ ◆

హియర్ ఫోర్డునందు ఒకఅవ్వన్నది. ఇంతదిన్నది ప్రపంచమున లేదు. 29 అంగుళముల పొడవు వయున్న నెంట్లు.

◆ ◆ ◆

1880 లో జర్మనీ దేశస్థుడు ఆల్ పాల్ అనువాతడు ఒకపెద్ద చక్రము ఒక చిన్న చక్రం వుండే బైస్కిల్ మీద 1009½ మైళ్లు 6 దినాలలో పోయినాడు.

◆ ◆ ◆

కియోనాంబా అను జపానుదేశస్థుడు తలమీద తలక్రిందులుగా చేతుల సహాయము లేకుండా పోధానకుంబ్రిని ఎక్కగలడు.



...ముద్రాపకులు, ... వెంకటేశ్వర విలాస ముద్రాక్షరశాలలో ముద్రితము, కావలి, నెల్లూరు